# కవిత

"తెలుఁగువానికైత దేశదేశాలకు
నొజ్జబంతి యగుచు విజ్జుఁగాక
ప్రాజ్ఞుఁడై కళాతపస్వియై విశ్వసా
హిత్యరాజ్యమాంధ్రుఁడేలుఁగాక!"

సంపాదకుఁడు:
జాస్తి వేంకటనరసయ్య

# కవిత



తెలుఁగువానికైత దేశదేశాలకు
నొజ్జబంతి యగుచు నిజ్జుఁగాక
ప్రాజ్ఞుఁడై కళాతపస్వియై విశ్వసా
హిత్యరాజ్య మాంధ్రుఁ డేలుఁగాక!

సంపాదకుఁడు:

జాస్తి వేంకటనరసయ్య

మూల్యము రు. 0-8-0

*



మన్మథ - విజయదశమి



భారతీ సన్మాన సంఘము

పామఱ్ఱు - కృష్ణా

*

భారతీ ప్రెస్, తెనాలి - 1955

# కవిత

సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగాన్

— నన్నయ

మును మార్గకవిత దేశం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్

— నన్నెచోడఁడు

భూరివివేకచిత్తులకుఁ బోలు ననర్గ దలఁపఁగ దళంబులగ
సౌరభమిచ్చు గంధవహుచందమునం బ్రకటంబుచేసి యిం
పారెడు పల్కులం బడయ నప్పలుకు ల్సరిగ్రుచ్చునట్లుగాఁ
జేరుప నేరఁగా వలయుఁ జేసెద నేఁ గృతియన్నవారికిఁ

కావున భారతామృతముఁ గర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్

— తిక్కన

కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణము లగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్
— బమ్మెర పోతన

ముదమునఁ గవికృత కావ్యము
నదరున విలుకానిపట్టినమ్మును బరహృ
ద్భిదమై తలయూఁపును బెఱ
యది కావ్యమె చెప్పఁ బట్ట నదియున్ శరమే?
— పూర్వకవి

తేనెసోఁక నోరు తీయనయగురీతి
తోడ నర్థమెల్లఁ దోఁచకుండ
గూఢశబ్దములను గూర్చినకావ్యమ్ము
మూఁగ చెవిటివారి ముచ్చటగును

కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చిచెప్ప నది తెలుఁగునకుం
బొందై రుచియై వీనుల
విందై మఱి కానిపించు విబుధులమదికిన్
— మొల్ల కవయిత్రి

నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే?
— అలసాని పెద్దన

మహి మన్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు త
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్

తను వగు శబ్దార్థంబులు
ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనరుగుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తులౌర కావ్యేందిరకున్

— రామరాజ భూషణుఁడు

అల్లనవిచ్చు చెంగలువలందు రజంబను కప్పురంబుపైఁ
జల్లఁగఁ జల్లనై వలచు సౌరభముల్ వెదచల్లు భావముల్
పల్లవహస్త చన్నుఁగవపయ్యెద జీబుగఁ దోఁచు భాతిగాఁ
బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్చుఁ గబ్బముల్

— పిల్లలమఱ్ఱి

ఘనతరఘూర్జరీ కుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యఱచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుగవఁ బోలి తేటయును జాటుఁదనంబును గాక యుండఁ జె
ప్పిన నదె పో కవిత్వమనిపించు, నగిం చటుగాక యుండినన్

— వేంకటనాథకవి

పదలాలిత్యము వర్గశుద్ధియును శబ్దస్థైర్యమున్ మంగళా
స్పదభావంబును రాజ్యయోగ్యతయు దోషస్ఫూర్తిరాహిత్యమున్
సదలంకార విశేషమున్ గలిగి విశ్వప్రాణ సౌభాగ్య సం
పదమై తేజియపోలి క్రాలవలదా! పద్యంబు హృద్యస్థితిన్

— పెదపాటి సోమయ

రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్యమెల్లనగునే నోహో యనంజేయదే
పాండిత్యంబున; నందునుం దెనుఁగుకబ్బం బద్భుతంబందు ద
క్షుండెవ్వాఁడిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్

— అకువీటి పెదతిమ్మరాజు

పద్యంబు సర్వకవితల
కాద్యంబై గానబద్ధమై శ్రుతిహితమై
హృద్యంబై నియతం బన
వద్యంబై లెస్స తోడువడు ధారణకున్

పండితశ్రేణి వేలుపుంబాసమీఁది
తగులమునఁ జేసి తెల్గును దెగడునాఁడు
మాతృభాషను మన్నించి మనిపినట్టి
వారి కర్పింతు మన్నమోవాక శతము

తెలుఁగునకు స్వస్తి సెప్పిన
తెలుఁగుకవిత్వంబు వలుకఁ దియ్యము నాకున్
గలుగద; మా తిక్కన య
జ్వలుత్రొక్కినత్రోవ కేను సమ్మతివడెదన్

తప్పులేనికైత సెప్పెద నని గుండె
పైని జేయివైచి పలుకఁజాలు
కవియెవండు? బుధులు కారుణ్యమూర్తులై
యుంట నాటసాగుచుండుఁ గాని

— అభినవ తిక్కన

తొల్లిసడల్చి కిప్పటివిధుల్ నిరసింపక ప్రాఁతక్రొత్తలం
దుల్లముసేర్చి దేశికవితోచితమార్గములం గమించు మా
కొల్లని దేమికద్దు? వివిధోజ్జ్వల కావ్యకథార్థయుక్తులం
దల్లరిపాలుగాని కవితాసవ మానెద మెల్లవేళలన్

— కవిబ్రహ్మ ఏటుకూరి

# ఆంధ్రభాష

తెలుఁగదేలయన్న దేశంబు తెలుఁ; గేను
దెలుఁగువల్లభుండఁ దెలుఁగొ కండ;
ఎల్లనృపులుగొల్వ నెఱుఁగవే బాసాడి;
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స

— శ్రీకృష్ణదేవరాయలు

జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘన లలితార్థ గౌరవవికాసి తెనుంగభిరమ్యమంతకున్
గనుగొనఁ జూతబీజమునకంటెను గోమలపత్త్ర పుష్పశో
భను మృదుపల్లవాభినవ బాలరసాలము సొంపునింపదే

జిలిబిలి పలుకుల బలుము
ద్దులుగులికెడు తెనుఁగుబాసతో సరియగునే
తెలిసియుఁ దెలియక వీనుల
నలయించెడు వెట్టిమొట్టి యఱవొఱబాసల్

తల్లి సమస్తభాషలకు దైవతభాషయ దేశభాషలన్
పిల్లలలోన నాంధ్రియనుపేరిటి దెంతయు ముద్దులాడి రా
ట్రల్లజు లాదరించిన కతంబునఁ బల్కులఁగుల్కు మీఱు య
ల్లల్లన దక్కు నక్కసెలియంద్రకు నెక్కుడు కీర్తి చేకొనెన్

వెలకాంత లెందఱైనను
కులకాంతకు తోడురారు కువలయమందున్
వెలివిద్య లెన్నియైనను
కులవిద్యకు సాటిరావు గువ్వలచెన్నా

— పూర్వకవులు

కమ్మని తెల్గటంచు నుడికారము సొంపుల నీ విశాల వి
శ్వమ్మున దీనిఁబోలిన వచస్సు నభస్సుమమంచు వేయి వా
క్యమ్ముల నేను మెచ్చుటయ కాదు రసజ్ఞు లుదారు లెల్ల ఖం
డమ్ముల మెచ్చి రిచ్చిరి వినమ్రతమైఁ గపురంపుటారతుల్

నీ తీరు తీయముల్ నిగ్గుజగ్గులు సూచి
బ్రౌను బ్రహ్మరథంబు పట్టెనీకు
నీ ఠీవి నీహొయల్ నీ బెడంగులు మెచ్చి
యిబ్రహీమ్ కానుకలిచ్చె నీకు
నీ సొంపు నీ పెంపు నీ యొయ్యారమెఱింగి
శాహాజీ పరిచర్యసలిపె నీకు
నీ తేట నీ పాట నీ నీటు దిలకించి
యఱవలెల్లరు దాసులైరి నీకు

ముజ్జగంబుల నినుఁబోలు ముద్దుగుమ్మ
రసికతావేత్తలకుఁ గానరాదు రాదు
ఏ పురాపుణ్యలేశమో యిటకుఁ దెచ్చి
యర్చకుని జేసె నన్ను నీ కాంధ్రవాణి

చెలువమ్ము నెగఁజిమ్ము జిలుఁగుఁ దెల్గులతోడఁ
బెన్నగట్టునఁ గృతుల్ పెరుఁగునాఁడు
మందారమకరంద మాధుర్య ధుర్యమై
యోరుఁగంటఁ గవిత్వ మూరునాఁడు
ధాటీ సమాటీక నాటోపమునఁ గొండ
వీటిలోఁ గావ్యముల్ వెడలునాఁడు
క్రొంగ్రొత్తరుచుల పొంగులఁ దుంగభద్రతో
వియ్యమై కబ్బముల్ వెలయునాఁడు

ప్రతిపదమ్మున రసచమత్కృతులు వెల్లి
వోడువఁ దంజాపురిం గైతనడుచునాఁడు
తల్లి ! నీ భువనైక సౌందర్యరేఖ
కాంచనైతిఁగదా ! కంటికఱవుదీఱ

— అభినవ తిక్కన

స్వర్గములులేవు తల్లి దేశంబుకంటె;
భాగ్యములు లేవు తన తల్లిభాషకంటె;
దైవములులేరు తను గన్న తల్లికంటె;
నరులకెల్లర కివి జీవనాడులరయ

— రాయప్రోలు

కలవు సహస్రభాషలు జగమ్మున నందొకటేని, తేనియల్
చిలికెడి తెల్గుతోడ సరిసేయఁగఁజాలదు; విశ్వమెల్ల నీ
పలుకున కడ్డుసెప్పదు; సెబాసని విజ్ఞులుమెచ్చ సుందరో
జ్జ్వలకవితన్ సృజించి మనజాతికి నభ్యుదయమ్ము గూర్పఁడీ
— జాస్తి వేంకటనరసయ్య

కవులకంటెఁ దుహిన కర్పూర నిభకీర్తి
తెచ్చిరెవరు నీకుఁ దెనుఁగుతల్లి!
సాహితీతరంగ సంగీత రసధుని
దేశభాషలందుఁ దెలుఁగులెస్స
— నండూరు రామకృష్ణమాచార్య

సరస్వతి నారదునితో

రమణీయోక్తులచేత నర్థగుణసారస్యంబు గల్పించుచున్
దమినాయంగచయంబునన్ సహజసౌందర్యంబు పెంపొందఁగాం
చెమలంకారములుంచి తొల్లిటికవుల్ చేష్టాచమత్కార భా
గ్యము హెచ్చించుచు దీర్ఘకాలమునునుంగాపాడి రర్థక్రియన్

అటు సుఖయింపుచుండఁగ మదాస్యమునందు నిరర్థకంబులై
పటపటలాడు శబ్దముల బల్మిని బెట్టి రసంబునెట్టి య
క్కటికముతే కలంకరణకై తవముంగొని మేనుకుట్టి యి
ప్పటి ఘనులార్తి పెట్టెదరు ప్రాణముతీసినసుం గలంచుచున్

నారదుఁడు —

రసములు కావే ప్రాణము
లసమాన కవిత్వకాంత కవనీస్థలిలో ?

రసహీనమైన కవితకుఁ
బూసఁగించు నలంకృతి శవమున కిడు తొడవౌ

అమ్మా యేమని చెప్పుదు ?
నిమ్మహి నా మోముచూడ రిపు డెవ్వారుౕ
నమ్మము వేశ్యలమాటలె
కమ్మలు సుమ్మా రసికుల కర్ణంబులకుౕ

ఇట్టి దురవస్థఁజూచి యెందేనిఁ బోవఁ
దలఁచి వచ్చితి హృదయఖేదంబుతోడ
జనని! సంగీత సాహితుల్ కనులు నీకు
భరతఖండంబునను రెంటఁ బొరలుగ్రమ్మె

— కందుకూరి వీరేశలింగము పంతులు

## కవి

పొసఁగ ముత్తెపుసరు లొప్పహాళించినలీలఁ
దమలోన దొరయు శబ్దములుగూర్చి
యర్థంబు వాచ్యలక్ష్య వ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైన రీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి

యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగనేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె

చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను, సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత
నెలకొనిన, సౌరభముఁ జలువపసయుం గో

మలతయును గలిగి జనముల మిగులఁ బెంపెసఁగు
మలయపవనంపుఁ గోదమలకు మధురత్వం
బలవడిన, నీడు మఱి కలదనఁగవచ్చుఁ గడు
వెలయఁగల యీ సుకవి పలుకులకు నెంచన్

— పింగళి సూరన

వ. చల్లనగల వెన్నెలకు సౌరభము, అవి రెండుగల కర్పూర మునకు కోమలత, ఆ మూడుగుణములుగల మలయ మారుతమునకు మధురత్వము గల్గుచో నది సుకవి వాక్కులతో సమానమగునని భావము

చదువఁగావలె శబ్దశాస్త్రాదికమ్మును
వీక్షింపఁగావలె విద్యలెల్లఁ
జూడఁగావలె రాజచూడామణుల సభల్
పొందఁగావలె మహాభోగములను

దిరుగఁగావలె దేశదేశాల వెంబడిఁ
బడవలెఁ బడరాని పాటులెల్ల
వినఁగావలెను బూర్వ విద్వచ్చరిత్రముల్
దర్శింపవలెను ఛందఃప్రశంస

కవులు కవులన్నమాత్రానఁ గవులు గారు
ఎంతభారమ్ము గలదో! కవీశ్వరులకు
నెఱుఁగకుందురె మీవంటి నృపతిమణులు?
శ్రీమదానందగజపతి క్షితితలేంద్ర!

కవితామాధురి తాగ్రహించి "యిది శ్లాఘ్యంబిద్ది శ్లాఘ్యంబుగా
దు విశేషంబిట నిర్విశేషమిట మాధుర్యం బిటన్ వహ్వారే
కవిరాజా!" యని మెచ్చియిచ్చు నృపుఁడొక్కండైనఁ గర్వైనచోఁ
గవియై పుట్టుటకన్నఁ బాపపరిపాకంబుండునే భూవరా!

— తిరుపతి వేంకటకవులు

అచ్చపుజుంటి తేనియల నైందవబింబ సుధారసాల గో
ర్వెచ్చని పాలమీఁగడల విచ్చెడి కన్నెగులాబి మొగ్గలన్
మచ్చరికించు ఈ మధుర మంజుల మోహనముగ్ధశైలి నీ
వెచ్చటనేర్చినావు? సుకవీ! సుకుమార కళాకళానిధీ!

గంటమొ! చేతిలోది ములుగఱ్ఱయొ! నిల్కడ యింటిలోననో?
పంటపొలాననో? చేయునది పద్యమొ? సేద్యమొ? మంచమందు గూ
ర్చుంటివొ? మంచెయందొ? కవివో? గడితేరిన కర్షకుండవో?
రెంటికి చాలియుంటివి! సరే–కలమా హలమా ప్రియంబగున్?

— కరుణశ్రీ

పరుగులువారు భావపరిపాక రసామృతసార వాహినీ
స్ఫురణము; గానమాధురి యపూర్వగుణ శ్రవణానురంజకం
బరయఁ బదార్థసంపద మహామహిమాన్విత మద్దిరా కవి
త్వరమ వరించెఁ గోరి నిను వర్థిలుమార్య! చిరాయురున్నతిన్
— బూదూరు రామానుజులు రెడ్డి

మకుటములేల యశ్వములు మత్తకరుల్ శిబికాదులేల సా
యక నివహమ్ములేల చతురంగబలమ్ములు నేల నీకు ? మా
ధుకణమృదూక్తి సంపదలతో హృదయమ్ముల నేలు లోకశా
సకుఁడవు; నీ వసించు చిటిచాఁపకు నోపవు సింహపీఠముల్

అదె! పరతంత్రముక్తమగు నాంధ్రమహిన్ నవజీవనోత్సవా
భ్యుదితులు నీ ప్రజల్ వికసితోత్పల మాలికలూని నల్గడల్
వెదకుచు నేగుదెంచిరి కవీ! రసరాజ్య మహాభిషేక సం
పదనినుఁబూన్పఁగా;వరణమాల్యముమౌళిఁబరిగ్రహింపుమా
— కాటూరి

అందఱకంద సర్వనియమావళితో వెలుఁగొంద లోక మా
నందము చెంద నిర్మల సనాతన నూతనభావ సంపదల్
చింద ననేక కావ్యముల సృష్టియొనర్చి యశంబుగొన్న నీ
యందొక లక్ష్యమున్నది సుమా సకలాంధ్ర ధరాప్రజాళికిన్

కవియొక మార్గదర్శకుఁడుగాఁ బ్రజకండగ నిల్చి భావ్యప
ద్రవముల వాని నెట్టెడి విధంబులఁ జాటెడు పద్యగద్యముల్
వివరణమొప్ప వ్రాసి చదివించి ప్రచారమొనర్చి జాతి గా
రవమును నిల్పఁగావలయురా! నిను మెత్తురికైనచో జనుల్

అన్నమో రామచంద్రా ! యంచు ఘోషించు
పేదవానికి నేల ప్రేమగీతి
పంట పైరులు పాడు పాడయ్యెనని యేడ్చు
కర్షకావళి కేల కామలీల
కూలి గిట్టదటంచు గోలచేసెడి కార్మి
కులకేల గండుగోయిలల కూఁత
కడుపుమంటలటంచు మిడుకుచుండెడి కూలి
ప్రజల కీనాఁడేల ప్రణయరసము

అస్వతంత్రతా కీలల నడలుచున్న
భారతాంబకు నేల శృంగారరచన
దేశకళ్యాణమునకు సందేశ మొసఁగు
కావ్యముల వ్రాయుమోయి సత్కవివరేణ్య !

వంచనలేక యీ పగిది వ్రాయుట నీ దగు వంతు నిన్నుఁ బో
షించుచు గౌరవించుచు రచించిన వానిఁ బఠించి లాభమున్
గాంచుట వారివంతు సరిగా విహరింపుము దాస్యబంధమున్
ద్రెంచి పవిత్ర భారత సతీమణి యాశిషముల్ గ్రహింపుమా !

తుమ్మల విశ్వనాథులు స్వస్తివచియింప
దేవులపల్లి మేల్ దివ్వె పట్ట
కాటూరి పింగళుల్ కైవారములు పల్క
రాయప్రోల్ కనకవేత్రమ్ము దాల్ప

పరుగులువారు భావపరిపాక రసామృతసార వాహినీ
స్ఫురణము; గానమాధురి యపూర్వగుణ శ్రవణానురంజకం
బరయఁ బదార్థసంపద మహామహిమాన్విత మద్దిరా కవి
త్వరమ వరించెఁ గోరి నిను వర్ధిలుమార్య! చిరాయురున్నతిన్
— బూదూరు రామానుజులు రెడ్డి

మకుటములేల యశ్వములు మత్తకరుల్ శిబికాదులేల సా
యక నివహమ్ములేల చతురంగబలమ్ములు నేల నీకు? మా
ధుకణమృదూక్తి సంపదలతో హృదయమ్ముల నేలు లోకశా
సకుఁడవు; నీ వసించు చిటిచాఁపకు నోపవు సింహపీఠముల్

అదె! పరతంత్రముక్తమగు నాంధ్రమహిన్ నవజీవనోత్సవా
భ్యుదితులు నీ ప్రజల్ వికసితోత్పల మాలికలూని నల్గడల్
వెదకుచు నేగుదెంచిరి కవీ! రసరాజ్య మహాభిషేక సం
పద నినుఁ బూన్పఁగా; వరణమాల్యము మాళిఁ బరిగ్రహింపుమా
— కాటూరి

అందజకంద సర్వనియమావళితో వెలుఁగొంద లోక మా
నందముచెంద నిర్మల సనాతన నూతనభావ సంపదల్
చింద ననేక కావ్యముల సృష్టియొనర్చి యశంబుగొన్న నీ
యందొక లక్ష్యమున్నది సుమా సకలాంధ్ర ధరాప్రజాళికిన్

కవియొక మార్గదర్శకుఁడుగాఁ బ్రజకండగ నిల్చి భావ్యప
ద్రవముల వాని నెట్టెడి విధంబులఁ జాటెడు పద్యగద్యముల్
వివరణమొప్ప వ్రాసి చదివించి ప్రచారమొనర్చి జాతి గౌ
రవమును నిల్పఁగావలయురా! నిను మెత్తురికైనచో జనుల్

అన్నమో రామచంద్రా! యంచు ఘోషించు
పేదవానికి నేల ప్రేమగీతి
పంట పైరులు పాడు పాడయ్యెనని యేడ్చు
కర్షకావళికేల కామలీల
కూలి గిట్టదటంచు గోలచేసెడి కార్మి
కులకేల గండుగోయిలల కూఁత
కడుపుమంటలటంచు మిడుకుచుండెడి కూలి
ప్రజల కీనాఁడేల ప్రణయరసము

అస్వాతంత్ర్యతా కీలల నడలుచున్న
భారతాంబకు నేల శృంగారరచన
దేశకళ్యాణమునకు సందేశ మొసఁగు
కావ్యముల వ్రాయుమోయి సత్కవివరేణ్య!

వంచనలేక యీ పగిది వ్రాయుట నీదగు వంతు నిన్నుఁ బో
షించుచు గౌరవించుచు రచించిన వానిఁ బఠించి లాభమున్
గాంచుట వారివంతు సరిగా విహరింపుము దాస్యబంధమున్
ద్రెంచి పవిత్ర భారత సతీమణి యాశిషముల్ గ్రహింపుమా!

తుమ్మల విశ్వనాథులు స్వస్తివచియింప
దేవులపల్లి మేల్ దివ్వె పట్ట
కాటూరి పింగళుల్ కైవారములు పల్క
రాయప్రోల్ కనకవేత్రమ్ము దాల్ప

వేముల జంధ్యాల వింజామరల వీవఁ
దెలుఁగురాజు పతాకకలిమిఁజూప
జాషువా యేటుకూర్ జాతిగీతికఁ బాడ
నాయనివారు సన్నాయి నూద
తాపి బాపిరాజులు పూలదండలిడఁగ
నభ్యుదయ నిస్వనములు మిన్నంటి మ్రోఁగ
సాగుచున్నది నీ మహోత్సవము నేఁడు
ఆంధ్రకవితా సవిత్రి! దీర్ఘాయురస్తు

— కన్నెకంటి వీరభద్రాచార్యులు

నిరుపహతిస్థలంబును కనీసము నాకలివేళకింత ఓ
గిరమును చింకిచాపయు లిఖించుకొనందగు వస్తుజాత మ
క్కరపడికోర లేదనక గౌరవమున్ ప్రకటించు స్నేహితుల్
దొరకకయున్న నెట్టుల కృతుల్ రచియించుట సాధ్యమీకలిన్

— గొట్టుముక్కల కృష్ణమూర్తి

ధరణిన్ వాఙ్మయపీఠమెక్కి బహుధాధర్మంబు శాసించి త
త్సరణిన్ దూషణభూషణంబులను శిక్షారక్ష లుద్దించుచున్
సరసామోదముగాగ మానవ మనస్సామ్రాజ్య మశ్రాంతమున్
బరిపాలించు కవీశు వైభవము విశ్వశ్రేయమున్ గూర్చురా

— వేదాంతకవి

కవితా లతాంగికిఁ గర్ణభూషణమైన
కలువ మీచేఁబడి నలఁగిపోవు;
మీ కృతికన్యలకీ కుందనపుఁ దళుకు
నగలు కైసేయు పుణ్యమ్ముగలదె?

ఈవలిగాడ్పు మిమ్మావహించిన దవ
జ్వాల లీనునె కాని సౌఖ్యమిడదు
తీయని యీ గండుగోయిల గానమ్ము
వెగటాయె నౌర మీ వీనుగవకు

ఈతుషార జలమ్ము మీచేతులంటి
మలినమైపోయెఁ గొనకున్న మానె పొందు
సుకవిభోగ్యమ్ము లిచటి వస్తువులు వీని
నలిపివేయకుఁ డటునిటుఁ గలఁచివైచి

ప్రౌఢసమాసకల్పనమున్న నీయొద్దఁ
జూపుమీయసి చేయిచాపె నొకఁడు
శ్లేషకవిత్వ మంజూష నీకడనున్నఁ
గొనియెద నేనంచుఁ గొసరెనొకఁడు
సత్కావ్యరచనా రసాయనంబున్నచో
నీ బుద్ధినింపు మం చిచ్చె నొకఁడు
ఆశుకవిత్వమ్ము నల్లు మంత్రములున్న
నూదుమీయని చెవియొగ్గె నొకఁడు

పారసీమెట్లు వ్రాయంగఁ బనికివచ్చు
ఫణితులేమేని యున్నచో బయటఁబెట్టు
మంతియేకాని కవనదాహమ్ముఁ దీర్పఁ
మంచునీళ్ళలయని కోపగించెనొకఁడు

— పింగళి, కాటూరి

ఒకనికి విద్యయందు మఱియొక్కనికిం గ్రయ విక్రయంబులం
దొకనికి శిల్పమందు నింకనొక్కనికిన్ వ్యవసాయమందు నొ
క్కొకనికి దారులోహవసనోపల మృత్క్రియలందు వారి వా
రికి మదికెక్కినట్టి కళఁ బ్రేమ తగుల్కొను జీవికార్థమై

కాని యానందమునుగూర్చి మానసంబు
ధనము భోగంబు సమకూర్చి తనువుఁదనిపి
యలరఁజేయును గాన విద్యానురక్తి
యిరుతెఱంగుల నాత్మార్థమే నిజంబు

— మల్లాది సూర్యనారాయణశాస్త్రి

గండి తెగుటనో సకాలానుగుణ్య వ
ర్షప్రాప్తి లేమినో సరసు లింకు
చోర నిరంకుశక్షోణీశ దుష్ప్రయ
త్నములచే ధననిధుల్ నాశమగును
ఉర్వి నపాత్రుల కొనరింపఁబడిన బ్ర
హ్మస్థాపనం బెన్న వ్యర్థమగును
భూరి నిదాఘాతపోరుతీక్ష్ణతచేత
వరభూరుహోపేతవనము లెండు

ఉరుతరానిలోద్ధతి గుడుల్ విరిసి కూలు
కొడుకు దుశ్శీలుఁడైనచో గోడుగూర్చుఁ
గాని యాచంద్రతారభాస్కరము వెలుఁగు
సత్కృతియె వతంసము సప్తసంతతులను

— శ్రీరామ్ వీరబ్రహ్మకవి

ఆనందంబున కిక్క సృష్టికిని ప్రత్యామ్నాయ మత్యద్భుత
స్థానం బీశ్వర సన్నిధానకర మత్యంతోపకార ప్రభా
ధీనం బున్నతకల్పనా ప్రతిభకున్ దేశంబు లోకోత్తరం
బానం దేర్చెడు చిత్సుధారసము గాదా కైత యూహింపఁగన్

చీఁకటినుండి తేజమును చేటుతనంబుననుండి మేళులన్
నూకలనుండి రత్నముల నూలుననుండి సువర్ణ వస్త్రముల్
కాకులనుండి కోయిలలఁ గర్దమమందు సుధాస్రవంతులన్
లోకముకై సృజించి యిడు లోభములేని కవిత్వ మెంతయున్

— అయితము కాళీవరప్రసాదరాయకవి

కవితఁ జెప్పెడు నాతండు భువనహితుఁడు
అతని సత్కీర్తి జగములో సతతముండుఁ
గాన కవిరాజు మించిన ఘనుఁడు లేఁడు
సుప్రసాద శ్రీ కాళీవరప్రసాద

నవరసంబుల గురియించు నవ్యభంగి
అందుముగ్ధులఁ గావించు నఖిలజనుల
సరసకవనంబు మోహనాస్త్రంబుగాదె
సుప్రసాద శ్రీ కాళీవరప్రసాద

— వాకాటి పెంచలరెడ్డి

నవమంజులాలాప నైపుణ్య మొప్పార
గురుహిత కృతులను గూర్చినావు
కరుణారసాన్విత కమనీయ రచనల
నస్పృశ్యతా భావ మణఁచినావు

మాధుర్య సంపూర్ణ మాన్యశైలి నటింప
స్త్రీజాతి దశలఁ జిత్రించినావు
వర్గ వర్ణ ద్వేష వాసనాదూర మా
గుణమె భూషణమంచుఁ గొలిచినావు

నవ్యకావ్య సుమామోద మవ్యయముగ
నేల నాలుగుచెఱఁగుల నింపినావు
అమలజీవన ! సుకవీశ ! ఆంధ్రపుత్ర
అందుకొనుమయ్య నాదు జోహారు లివిగో

తెలుఁగుల తొంటిపౌరుషము తేకువ జాఱఁగ వ్యర్థరోషముల్
బలసె సమాజమంతయును బాధలఁ జెందుచునుండె నిచ్చలున్
గలుగదు విద్య తిండియును గష్టము నోర్చెడి పేదవానికిన్
కలమున వీని దిద్ది కృపఁ గాచెడువారు కవీశులే కదా !

—జా స్త్రీ

## చిత్రకారుఁడు

లాలిత్య లక్ష్మీవిలాసరంగమ్ము ని
ల్పితి వజంతాచిత్రలేఖనమ్ము
నవరించితివి శైవభువనంబు నెల్లూరా
కొండను మైనంపుటుండఁ జేసి
విఠ్ఠలప్రభుని కోవెలకంబములచేతఁ
బలికింపఁగంటి సప్తస్వరాలు
ఒలికించితౌర ! తిర్మలనాథు నగరులో
వెలలేని సభ్యతావిలసనములు

భగవదన్వేషణార్థమై పాటుపడిన
యుత్తమతపస్వివై కళాయోగివైన
నీకు ఋణపడె రసలుబ్ధలోకమెల్ల
నాంధ్రశిల్పీ! చిరంజీవివయ్య నీవు



—అభినవ తిక్కన

ఎన్నియుగములవఱకు సహించుకొనెనో
తెలుఁగుశిల్పుల చాతురీవిలసనంబు
యమునయొడ్డునఁ బూచి దిగంతములను
యశమునించిన తాజమహాలు కొఱకు



—జాషువా

కుంచెచేఁబూని మనమునఁ గొంకుమాని
మధుర మధురాతి విజ్ఞానమహిత మైన
యెట్టి చిత్రమ్ము నేనియు నిట్టె వ్రాయు
దహాహా! నీ కళాకౌశల మ్మద్భుతమ్ము



భారతీయ త్యాగపాటవమ్మును దెల్పు
చిత్రమ్ము వ్రాసెదు చెన్నుమీఱ
ప్రకృతి సౌందర్య విభ్రాజిత మ్మైనట్టి
చిత్రమ్ము వ్రాసెదు చెన్నుమీఱ
సాంధ్యరాగచ్ఛటాసదమల మైనట్టి
చిత్రమ్ము వ్రాసెదు చెన్నుమీఱ
నవరసభంగిమ నైపుణ్యమును జాటు
చిత్రమ్ము వ్రాసెదు చెన్నుమీఱ

నెట్టి ఘటనల నేనియుఁ బట్టు విడక
జీవరూపమ్ములనం గూర్చి చెలఁగు దీవు
సృష్టికర్తను మఱపించు చిత్రకార!
ఆయురారోగ్య భాగ్యాల నలరు మయ్య!
కవియు శిల్పియు చిత్రక గాయకులును
సత్య శివ సుందరమ్ముగ సంఘమునకు
నూత్నభావాలు వెదచల్లి నొవ్వులేని
యభ్యుదయమార్గమున్ జూపి యశముగాంత్రు

— జాస్తి

# పేదలు

కాలెడి పొట్టతో విరతిగానని చింతలతో విశీర్ణమై
సోలెడి మేనితో బడుగుఁ జూపులతో నిజరక్త మాంస కం
కాళము లర్థమత్తులకుఁ గానిచటన్ బలివెట్టి రెవ్వరా
మాలలు మాదిగల్ గగనమంటపమెక్కిరె యిట్లు చుక్కలై

యీ గోడ యిసుక సున్నము
యోగించిన వస్తువంచు యోజింపకుఁ డీ
ప్రేగులు మూల్గెడి యనదల
మైఁగల రుధిరాస్థులిట్లు మనకుం దోచున్
కలమెత్తిన హలమెత్తిన
మలమెత్తినవారి నొక్కమైఁ జూడవలెన్
వలఁతియు నలఁతియు లేదిటఁ
బలువృత్తులు సాగినపుడె బ్రదుకులుసాగున్

— అభినవ తిక్కన

చీఁకటికొంపలో బ్రతుకు, చింకితలల్ మెయిఁగాటిపాఁత పె
ల్లాఁకటి కింత సంకటియు, నంబలియున్, జవికింత యుప్పుఁగ
వేఁకటికింత చప్పిడియు, వేఁకికిఁ బస్తులునైన వీరలన్
నీ కరుణాకటాక్షరస నిస్సరణమ్ముల ముంచి యెత్తవే!

— కాటూరి

చెమటల్ కార్చి చతుస్సముద్రముల రాశింబోసి యీ మంటి గ
డ్డ మహాలక్ష్మినిఁ జేసి భూప్రజకు శ్రేష్ఠంబైన పుణ్యాంబు శాం
తము పండించి విశాల విశ్వజన సంస్థానమ్ము కూర్మావతా
రముగా మోసెడి కూలితండ్రిని సదా ప్రార్థించి యర్థించెదన్

— వేదాంతకవి

ధనికు లజీర్ణతాదాసులై పడియుండ
బీదలు తిండికై బాధఁ జెంద
సౌధమ్ము లాకాశ సామీప్యమును బొంద
పేదల గుడిసెలు పెరిఁగిపోవ
మోజైన వస్త్రాల మురియఁగాఁ గొందఱు
గోచిగుడ్డయు లేక కొంద ఱేడ్వ
విజాను లగువారి వేదిక చెంతనె
యజ్ఞాని దైన్యము లలముకొనఁగ

జవము జీవము కలిగి యీ జనమునందె
విప్లవం బేది యావిర్భవించు నొక్కొ
కటకటా ! యెట్టి దుఃఖమ్ము కనఁగనయ్యె
సౌఖ్య మింకెట్టులుండును సమత లేక ?

కుంటి గుడ్డి చెవిటి కుములుచు వెతలతో
దారులలో నిల్చి తల్లడిల్ల
మొండి ముసలి నడ్డి మూల్గుచు రైళ్ళలో
మితిలేని రోదనల్ మేళవింప
క్షయ బొల్లి కుష్ఠు సంకర రోగములచేత
బాధితు లెందఱో పలవరింప
ఆధిచే వ్యాధిచే నశ్రాంత మెల్లెడ
శోకంపు వార్తలే ప్రాఁకుచుండ

కంటఁ గన్నీరు గార్చును కఠినుఁడైన
శాంతి యింకెట్లు లుండును స్వాంతమందు?
పూని ప్రభుతయే వీరికిఁ బోషణంబు
సలుప సమకట్టవలయును శ్రద్ధతోడ

కొందఱు భోగభాగ్యములకున్ సరదార్లయి కుల్కుచుండఁగాఁ
గొందఱు కూడుగుడ్డలకుఁ గుందుచునుందురు దైన్యరాసులై
యందఱు నొక్కరూపమున హర్షమునొందుచుఁ గానిపింప రీ
చందమ దేల కల్గెనను శంకకు నుత్తర మెవ్వఁడిచ్చునో?

ధనికుల్ కొందఱు సంతతిన్ బడయ కాత్మన్ లెస్సదుఃఖింపఁగాఁ
బెను సంతానము నీదలేక వగతోఁ బేదల్ విలాపింత్రు సా
మ్మున కేలోపము లేనివారు చదువన్ బోరార! విద్యారతుల్
ఘన దారిద్ర్యముచేత నాఁగెదరు లోకంబెంత చిత్రంబహో!

విశ్వమానవ మైత్రి విలసిల్లి పుడమిలో
సంగ్రామ విరమణ జరుగువఱకు
ఆహారమే లేక యాత్మహత్యకుఁ బూను
మానవలోకమున్ మనుచువఱకు
ఆధారమే లేని యనద లందఱుగూడ
విద్యాసమగ్రులై వెలయువఱకు
హింస, కాపట్యాది హేయగుణావళి
మలిన కర్మమ్ములు మాన్పువఱకు

సంఘ సంస్కార మంతట జరుగువఱకు
లలితకళల వికాసంబు కలుగువఱకు
ధర్మరాజ్యమ్ము సర్వత్ర తనరువఱకు
వలదు కర్తవ్య ధర్మముల్ వదల వలదు

— జాస్తి

కుడువఁ గట్టంగ నన్నమ్ము గుడ్డలేక
శోకమును బొందు భవదీయ సోదరులను
గన్నులారంగ వీక్షించి మిన్నకుంట
తగదు తగదు నీ కెపుడు హైందవకుమార

జలదముల్ భుజియింపవు సస్యములను
దమజలమ్మును వాహినుల్ త్రాగ వెపుడు
స్వాదు ఫలములనేని వృక్షములు దినవు
ఇల సుజనసంపద పరోపకృతులకొఱకె!

— కోగంటి దుర్గామల్లికార్జునరావు

# తెనుఁగుతల్లి

కనిపింపదే నేడు! కాకతీయ ప్రాజ్య
సామ్రాజ్య జాతీయ జయపతాక -
వినిపింపదే నేడు! విద్యానగర రాజ
సభలోని విజయ దుందుభుల మ్రోత-
చెలఁగదే నేడు! బొబ్బిలికోట బురుజుపై
తాండ్రపాపయ తళత్తళల బాకు -
నిప్పచ్చరంబయ్యెనే నేడు! వీర ప
ల్నాటి యోధుల సింహనాద లక్ష్మి -

చెక్కుచెదరని - యేనాడు మొక్కవోని -
ఆంధ్రపౌరుష మిప్పు డధ్వాన్నమయ్యె;
మరల నొకమాటు వెనుకకు తిరిగి చూచి
దిద్దుకోవమ్మ! బిడ్డల తెనుగుతల్లి!

గంటాన కవితను కదనుత్రొక్కించిన
"నన్నయభట్టు" లీనాడులేరు
కలహాన కంచు ఢక్కల నుగ్గునుగ్గు గా
వించు "శ్రీనాథు" లీవేళ లేరు
అంకానవాణి నోదార్చి జోలలువాడు
"పోతనామాత్యు" లీ ప్రొద్దు లేరు
పంతాన ప్రభువుచే పల్లకీనెత్తించు
కొను "పెద్దనార్యు" లీదినము లేరు

"వాణి నా రాణి" యంచు సవాలుకొట్టి
మాటనెగ్గించు వీరు లీ పూటలేరు
తిరిగి యొకమాటు వెనుకకు మరలిచూచి
దిద్దుకోవమ్మ! బిడ్డల తెలుగుతల్లి!

— కరుణశ్రీ

శ్రీముఖహాలాది భూమీశ్వర క్షాత్ర
జీవిత కథలచేఁ జేవ నొంది
సిద్ధనాగార్జున శ్రీ మల్లినాథార్య
పాండితీగరిమంబుఁ బ్రస్తుతించి
నిద్రాణలోకమ్ము నిత్యమున్ మేల్కొల్పు
జాతీయ రచనల సార మొతిఁగి
రసలుబ్ధులకు సమారాధనీయం బైన
శిల్ప సంపత్తికి సేవ నెఱపి
మధుర గీతామృతంబు వేమాఱుఁ గ్రోలి
విశ్వ విజ్ఞాన పటిమచే వెలుఁగు నొంది
నిత్య కళ్యాణ రాశివై నెగడు నట్లు
దిద్దుకొనుఁడయ్య! దేశమ్ము తెలుఁగులార!

స్వీయము రాష్ట్రమున్ గడనసేసి నిరంతర దీక్షఁ గంకణ
శ్రీయుతులై తనర్చి బుధసేవిత ధర్మపథానురక్తులై
కాయము చెమ్మటల్ కురియఁ గష్టమునోర్చుచు మాతృమండల
శ్రేయముగోరుచున్ బగలు రేయి ప్రయత్నముసల్పుఁడా ధృతిన్

కులమత వైరముల్ విడిచి కూడి త్రిలింగ ధరిత్రి కష్టముల్
తొలఁచి కళా ప్రవాహమునఁ దోఁగుచు గానము సేయుఁ డాంధ్రతన్

కలిమినిసంస్కృతిన్ విపులగౌరవ మొందుచుఁ
కలము హలమ్ము పట్టుఁడిఁకఁ గల్గునుజాతికిఁ శె
అజ్ఞానము దారిద్ర్యము।వజ్ఞయునశియించునట్లు వ
విజ్ఞానబోధమొసఁగుఁడుసుజ్ఞానరమా నిరూఢశో

భోజరాజిచ్చోటఁ బుట్టలేదందువా ?
యాంధ్రభోజుని మాట యాఁ
రాణాప్రతాపుండు కానరాఁడందువా ?
శ్రీరామరాజు విశేషమరం
ఝాన్సిలక్ష్మీబాయి జనియింపదందువా
మాంచాల చరితమ్ము నెంచ
తులసిదాసిచ్చటఁ గలుగలేదందువా ?
పోతన్న కత తలపోయవన్న
యెందునుంగూడ లోటింతయేని లేదు
ముందునకు వచ్చి నిలఁబడి సందడిగను
నీదుశక్తిని నీ వెంచి నెగడుమోయి ?
యమలగుణగణహార! యో యాంధ్రవీర !

---

కాకుళమందు ధాన్యకటకంబున హంపిని దంజ
నేకశిలాపురిన్ మెఱయు శిల్పవిచిత్రము పాటు
శ్రీకబరీభరమ్మున విచిత్రసుమస్తబకమ్ము నిర్జరీ
లోకమనోహరం బయి తెలుంగులకెక్కెమునాటు

ఆంధ్రరాజ్యస్థాపనాచార్యుఁడై తెల్గు
వేలు పైనాఁ డాంధ్రవిష్ణువిభు

రణకళానిధి సుశర్మను జంపి మగధోర్వి
శాసించె శ్రీముఖచక్రవర్తి
శాత్రవాహుల నెల్ల నదలించె హాలుండు
శాలివాహనశకస్థాపకుండు
నిజజయస్తంభముల్ నిఖిలదిక్కులఁ బాఁతె
గౌతమీపుత్రుండు శాతకర్ణి
శాత్రవుల గెల్చి మాళవధాత్రి కెల్ల
నాథుఁడయ్యెను వాసిష్ఠినందనుండు
ప్రాఁతవడినట్టి యాంధ్రభూపతులకథలు
చదువుఁ డొకసారి కండలు కదలియాడ

దేవుఁడన మాతృదేశమ
దేవత లనఁ బ్రజల యజ్ఞదీక్ష యనంగా
సేవావ్రత నిష్ఠయ యివి
జీవనసూత్రములుగాఁ బ్రసిద్ధిం గనుమా!

నీ కొఱకుఁ గాక జాతి
శ్రీ కొఱకే డస్సి డస్సి జీవింపుమయా!
నీకీర్తి విరియువెన్నెల
ప్రాఁకి దెసల్-కొసలు చివురుపట్టి రహింపన్

మేలు తెలుఁగుం బతాకకు
జే లాంధ్రప్రజకు మాతృసేవారతకున్
శ్రీలు తెలుఁగుంగృతికి జే
జే లాంధ్రతపస్వి పొట్టి శ్రీరాములకున్

— అభినవతిక్కన

# ఆంధ్రవిద్యార్థి

కాళిదాసకవీంద్ర కావ్యకళావీధి
పరుగులెత్తెడి రాచబాటనాకు
భట్టబాణునిముద్దుపట్టి కాదంబరి
కథలుచెప్పెడి చెలికత్తెనాకు
భవభూతిస్నేహార్ద్ర భావవైభవగీతి
కరుణా రసాభిషేకమ్మునాకు
వాల్మీకికవిచక్రవర్తి భావస్ఫూర్తి
ఆటలాడెడి పూలతోటనాకు

భారతీదేవి మృదులాంక భద్రపీఠి
ముద్దులొలికెడి రతనాల గద్దెనాకు
తెనుగుతోటల సంస్కృతవనలతాళి
నంటుత్రొక్కెడి ఆంధ్రవిద్యార్థినేను

ఒకమాటు కనుమోడ్చుచుందు బమ్మెరవారి
మందార మకరంద మధుర వృష్టి
ఒకమాటు మూర్కొనుచుందు తిమ్మనగారి
పారిజాత వినూత్న పరిమళమ్ము
ఒకమాటు చవిజూచుచుందు పెద్దనగారి
ద్రాక్షాగుళుచ్ఛ సుధా సుధార
ఒకమాటు విహరించుచుందు పింగళివారి
వరకళాపూర్ణ సౌవర్ణశిఖరి

ఒకట కవితా కుమారితో నూగుచుందు
గగన గంగా తరంగ శృంగారడోల
ఆంధ్రసాహిత్య నందనోద్యాన సీమ
నర్థి విహరించు "నాంధ్రవిద్యార్థి" నేను

—కరుణశ్రీ

చాళుక్యరాజ్యప్రశస్తి నీ వెఱుఁగవు
నార్మన్ ప్రభుత్వవర్ణన మొనర్తు
రుద్రమాదేవిపౌరుషభంగుల నెఱుంగ
వెలిజబెత్తు మహత్త్వ మెన్నుచుందు
సూరన్న కావ్యకళారూఢి నెఱుఁగవు
షేక్స్పియర్ కవికి జేజేల నిడుదు
మనతిమ్మరుసుబుద్ధిమత్త నీ వెఱుఁగవు
వాల్పోలుచరితంబు వల్లెవేతు

నిన్ను నీ వెఱుంగ కెన్నివిధానంబు
లాశ్రయించి సర్వదా శ్రమించి
యెట్టిబన్నములకు నియ్యకోలూనిన
లేదు లేదు ముక్తి లేదు నీకు

— అభినవతిక్కన

మానిత దేశభక్తి నవమంజుల వాక్సుధ శీల సంపదన్
ధీనుత పాండితీగరిమ, ధీరత, కావ్యకళానురక్తియున్
సూనృత వాక్యసిద్ధియును శోభిలఁజేయుచు నీవు నేర్వుమా
ధ్యానముతోడ విద్యల నుదారగుణంబులఁ గార్యసిద్ధికై

—జాస్తి

# భారతమాత

వెన్నతోడనె చతుర్వేద బుక్కలు పంచి
సుతుల కేజనయిత్రి చుంచుదువ్వె
త్రిజగంబు లన్యథా సృజియించు గడుసరి
కొసరి యేతల్లిచన్ గుడిచి తనిసె
ఆలు పిత్తినచో వరాల గుత్తులు పండు
నవనిపై నేరాణి హక్కువడసె
పాత్రంబులగు నిహాముత్ర సంపద లిచ్చు
తటిను లేదేవిపూదఁడలయ్యె

మూఁడు సంద్రాలు నగరాజు మోఁకఱించి
యేమహాశక్తి నర్చింతు రెల్లదెసల
నమ్మహేశ్వరి కఖిలకల్యాణఖనికి
భారతసవిత్రి కర్థినై ప్రాంజలింతు

— అభినవతిక్కన

యుగచరిత్రలు నేత్రయుగళి విప్పకముందె
చుక్కలు లెక్కించి చూచినావు
ఖండముల్ పసిలేఁత కంఠమెత్తకముందె
సామగానము చేయసాగినావు
కావ్యసత్కళలు లంగాలు దాల్చకముందె
సృష్టికి వలపుఁ గైసేసినావు
ఓషధుల్ పుడమిపై నుద్భవింపకముందె
వైద్యశాస్త్రమ్మును బలికినావు

ఓ యనంత పురాతన యోగవాణి!
నాఁడు నేఁడును నేనాఁడు వాడిపోని
నీదు సురభిళ విజ్ఞాన నిచయమునకు
భక్తిపూర్వక మన్నమోవాక మమ్మ

— అమ్మిశెట్టి

## భారతనారి

రణముల్ చేసిరి సత్యభామ మొదలౌ రామామణుల్ శేముషీ
చణలాత్రేయియు గార్గియున్ జదివిరా శాస్త్రార్థముల్ త్యాగపుం
బణమందున్ మనసాధ్వి లేఘనముగాఁ బ్రాశస్త్యమున్ గాంచినా
రణుమాత్రమ్మును సందియమ్మువల దాయా స్త్రీచరిత్రమ్ములన్

మానిత మాధురీ భరిత మంజుల శిల్పకళావిశేషమున్
గాన సుధాప్రపూర్ణ కలకంఠవిరాజిత వాక్చమత్కృతిన్
ధ్యానవిలీన మానస పథాంచితభక్తి గుణానురాగమున్
బూనుచు మానినీమణులు పోలుదు రెందును బూరుషాళితోన్

పావనసేవలన్ బ్రజకు వాంఛిత బోధల నందఁ జేయుచో
దేవత యండ్రు స్త్రీని ధర దివ్యకళాన్విత విజ్ఞ లందఱున్
బ్రోవ సమర్థలై మనలఁ బూర్వ నవీన విశేష విద్యలన్
భావపరంపరన్ వెలుఁగు భామినులందఱు పూజనీయలే

— జాస్తి

## మైత్రి

అనయము కల్పనాజగతియందు పరస్పరముగ్ మెలంగుచుగ్
మనమున నెయ్యపుం దలఁపు మార్దవమున్నపు డాప్తకోటి ద
ర్శనము సుఖప్రదంబగుట సత్యమదట్టిద యంతెగాదు గ్ర

న్నన విమల ప్రసంగము లనంతములై ప్రవహించి నందన
మ్మున విహరించు మాడ్కి కృత పుణ్యఫలంబు లభించిన ట్లఘు
మ్మున కెడసేసి మానవతఁ బ్రోచిన భాతిగఁ దోచి ప్రాణి యా
త్మను గిలిగింతలన్ మనుచుఁ దత్పరరక్తిఁ దలిర్చు నూతన
మ్మునకుఁ బురాతనమ్మునెడు పోగులతో నదుకున్ సమైక్య సా
ధనమయి రెంటినొక్క సమతం బొనరింపఁ బ్రయత్నమూను శ్ర
ద్ధను వికసింపఁజేయు లఘుతన్ గురుతాకృతి వృద్ధిసల్పి సాం
త్వనత ఘటించు భావసుమభద్రదమై ప్రణయాగ్ర భావ భా
జనమయి శ్రవ్యకావ్యమటు సత్యమునై శివమై నిరంతర
మ్మును గుణసుందరమ్మగుచు ముగ్ధ మనోహర దివ్యసౌఖ్య వ
ర్ధనమున దోహదంబగుచు తత్వవినోదముగూర్చు స్వార్థ వ
ర్జన పరమార్థసాధన పరాత్పరుభక్తిఁ జిగుర్పఁజేయుఁ బా
వనతకు నాలవాలమయి ప్రజ్ఞయుఁ బ్రాభవమున్ ఘటించి తీ
రని యసమగ్ర కల్పనల రాపిడులన్ సవరించు నిట్టిమై
త్రినిగొనియాడనేర్తునెయతీంద్రియమయ్యది "జాస్తి" మిత్రమా

— షేక్ దావూద్

# గురువు

మంజుల బోధచే మధుర భావమ్ములు
చిత్తమ్ములోపలఁ జేర్చుచుండు
కార్యశక్తిని బెంచు ఘనుల చరిత్రముల్
తేట తెల్లంబుగాఁ దెలుపుచుండు
విజ్ఞానపూరిత విషయజాలమ్మెల్ల
మనసున కెక్కించు మార్దవమున

బాల్యమ్మునుండియు బాగుగాఁ దెలియంగఁ
గర్తవ్య ధర్మముల్ గఱపుచుండు
పౌరశిక్షణ నిచ్చు సంభావ్యముగను
దేశ భాషాభిమానముల్ తేటపఱుచు
భావిజీవిత సౌభాగ్య ఫలము నిచ్చు
కూర్మి బోధించుచుండు సద్గురువరుండు

సంఘమునయందు మర్యాద సమసిపోయె
లోచ్చు రాబడి ఖర్చులు హెచ్చు లాయె
కట్టఁ దిన లేక కన్నులు లొట్టవోయె
నెట్టి దురవస్థ దేశికా! పట్టె నీకు
త్రాతవు నీవే విద్యా।దాతవు మఱి నీవ కావె? ధరణీ ప్రజకున్
నేతలు నిన్నే మఱచిరి।పాతక ఘటమెల్లనిండెఁ బగులక యున్నే?

## పుస్తకము

సరసమంజుల కథా సల్లాపములతోడ
నొకమాఱు చిత్తమ్ము నూఁపు దీవు
జీవిత చరితముల్ చేదోడుగా నిచ్చి
మహనీయ నీతులన్ మనుతు వీవు
విజ్ఞానదాయక విమలబోధలచేతఁ
బ్రజ్ఞా విశేషముల్ పలుకు దీవు
నవరస మాధురీ నానార్థ కల్పన
నొప్పుచు నానంద మొసఁగు దీవు
విశ్వభూగోళమండలి విషయజాల
మంతయునుగూడ నీ యందు నమరి యుండు

సర్వజనముల హితము నీ సద్వ్రతమ్ము
పూతచారిత్ర నికురుంబ! పుస్తకంబ!
చిత్తము శాంతతన్ విడిచి జీర్ణతనూభవ రోగరాజి నా
యత్తము గాక మానవుఁడుహా! యని దుఃఖమునొందునప్పుడో
పొత్తమ! నీవ యాతనికిఁ బోవని మిత్రమవై హితమ్ము లా
సత్తిని దెల్పుచుండెదవు సాత్త్విక వృత్తిని తృప్తి నిచ్చుచున్
— జాస్తి

## శారద

క్షోణితలంబునన్ నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ చిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్యపాణికిన్
తల్లీ! నిన్నుఁ దలంచి పుస్తకము చేతం బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదువాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ! పూర్ణేందుబింబాననా!
— పోతన

వాణీ! మంగళ పుస్తక పాణీ! నినుఁగొల్చి కవనపథముననడుతున్
వీణాశాలిని! మ్రొక్కుదు రాణింపగఁ జేయుమమ్మ రమణీయ కళన్
— జాస్తి

ధనలోపంబొకఁడున్న మానవున కీ ధాత్రిన్ సుఖింపంగ లే
దనవచ్చున్ దగుపీలు; కాని నిను స్వాంతంబందు సేవించి నీ
యనురాగమ్ము గడించువానికి నసాధ్యంబుండదంచున్ ధరన్
ఘనులౌ సత్కవివర్యులెల్ల మును వక్కాణింపరే శారదా
— షేక్ అలీ

# జోహారు

తెనుఁగుతల్లి! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు
నినుఁజూచి నినుఁబాడి నినుఁ గొల్చువేళ నా
కను లాణిముత్యాల గనులుగా నగునహో!
తెనుఁగుతల్లి! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు
నీపాలు జుంటితేనియ తేటలో గోస్త
నీ పక్వరసమో సుధాపూరమో యూట
నాపల్కు లీ తీయనకు నోఁచి విశ్వ వా
ణీ ప్రపంచ ప్రశంసాపూరితము లాయె
తెనుఁగుతల్లి! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు
కుటిలశాత్రవకోటిగుండెలో నిదురించి
యిటుసేతు వటుగంగ యెల్లగా జగ మేలె
నటరాజకంధరా నైల్యమ్ము నపఁగించు
పటుకీర్తి పెంచె నీపట్టి యెంతటివాఁడో
తెనుఁగుతల్లి! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు
ఎల్లోర కొండ నీ యల్లారు గీమటే
కొల్లూరి కొహినూరు కొప్పులోఁ బూవటే
కొల్లారు గనులు నీకోశం బటే పండ్లు
పుల్లనైపోవు నీ భోగమ్ము కన్నచో

తెనుఁగుతల్లి ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు
గౌతమీ కృష్ణానదీ తుంగభద్రాది
పూతస్రవంతికా పుంజమ్ము నీముద్దుఁ
గూఁతులై సీచేను నీతోఁట పండింప
నీ తనూజులు పైఁడి పాఁతఱల్ కప్పిరే!
తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు
ఏపుణ్యలేశమ్ము నాపాలిదాయెనో
నాపూజ కేలోకనాథుండు పొంగెనో
నీపావనోదర శ్రీపరంపరలలో
నీ పదార్చకులలో నేను నొక్కఁడనైతి
తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు — అభినవతిక్కన

## ము ం ద డు గు

కవనముల్లే – కవీశ్వరా
గానముజేసే – గాయకుడా
హృదయ గోళమున – భగ భగ మండే
విప్లవ జ్యోతుల – వెదజల్లుమురా
పేదల హృదయం – బాధామయమని
వ్రాసి చూపు నీ – కలము గీటుతో
పాడిచూపు నీ – కమ్మని గొంతుతో ॥కవ॥
కాల చక్రమున – ప్రతి నిమిషము తన
కండలు కరగి – కందెనవేసి

జగత్తుకంతకు - సేవను జేసే
దీన దయాళుడు - ఎవరో
కన్నులున్న కనుపట్టు వాడె - మన
జీవన్మృతుడు - పేదబాబని
చాటగ లేవోయీ నీవు - పాడగ రావోయీ ॥కవ॥
మేడలలోనా - మేలి ముసుగులా
బంగరుటుయ్యేల - లూగేవారే
మండుటెండలో - మల మల మాడి
బండ చాకిరీ చేసే - దాసిని
ఛీ పొమ్మంటూ - ఛా పొమ్మంటూ
చీడపురుగులా - గిసిరేస్తారని
చాటగ రావోయీ - నీవూ పాడగ లేవోయీ ॥కవ॥
మీ ధనమంతా - మీ బలమంతా
పోయేనాడూ - రాదుర వెంటా
తోటి సోదరుల - రక్తము త్రాగే
బ్రహ్మరాక్షసులు - మీరంతా
నరరూప రాక్షసులు - మీరంతా
విడు, విడు, విడు నీ - స్వార్థపరత్వం
విప్లవ మీ భువి - రేగక ముందె
కూడూ గుడ్డా - సమానత్వముగ
కల్గిననాడే - రామరాజ్యమది
రావాలన్నదె - గాంధి వాక్కని
చాటగ రావోయి - నీవు - వ్రాయగ లేవోయీ ॥కవ

— గుడిపూడి రాజేశ్వరీదేవి

## ఆంధ్ర మాతృస్తవము

మా తెలుగు తల్లికి
మల్లె పూదండ
మా కన్న తల్లికి
మంగళారతులూ

కడుపులో బంగారు–కనుచూపులో కరుణా
చిరునవ్వులో సిరులు–దొరలించు మాతల్లి
గలగలా గోదారి–కదలి పోతుంటే
బిరబిరా కృష్ణమ్మ–పరుగు లిడుతుంటే
బంగారుపంట లే–పండుతాయి
మురిపేల ముత్యాలు–దొర్లుతుంటాయి

అమరావతిగుహల–అపురూపశిల్పాలు
త్యాగయ్యగొంతులో–తారాడునాదాలు
తిక్కయ్యకలములో–తియ్యందనాలు

నిత్యమై, నిఖిలమై–నిలిచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి–మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి–కృష్ణరాయనికీర్తి
మా చెవుల రింగుమని–మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లీ! జై తెలుగు తల్లీ!
జై తెలుగు తల్లీ!

— "తెలుగుతల్లి" నుండి

# ఆంధ్ర పతాకము

ఆంధ్రకుమారా ! ఆంధ్రకుమారీ ! ఆంధ్రవీరవర్యా !
ఆంధ్రపతాకం బిదిగో దీనికి — హారతు లివ్వండి
ఆంధ్రమాతయున దిగ్దేశంబుల— నాదరమందినది
ఆంధ్రులనంగా శూరాగ్రేసరు - లందురు శాస్త్రజ్ఞుల్
తెలుఁగుగడ్డపై తెలుగుబాసపై – తీపి వదలకండీ
తెలుఁగురాజ్యమన — దిగ్దేశంబుల — తేజరిల్లినాది
తెలుఁగుబాసఁగల తీరుతియ్యములు — దిక్కులు మ్రోగినవి
తెలుఁగురాష్ట్రమును దెచ్చుట విధియని— తెలిసి చరించండీ॥
తెలుఁగువారిలో పౌరవులుగలుగని—తెన్నులుచూడండి ॥ఆం॥

శాతవాహనులు రాజ్యపాలనము – సల్పుచున్న నాడు
వేంగిరాజ్య చాళుక్యవంశజులు – పృథ్వినేలునాడు
కమ్మనాటిలో నాంధ్రచోడులును – గ్రాలుచున్న నాడు
పట్సహస్రమున వెలనాట్రాజులు – సరణి నేలు నాడు
కాకతీయు లోరుంగలు పట్టము – గట్టుకొన్న నాడు
ఆంధ్రపతాకములెట్లు వెలింగెనొ – యరసి చరించండి
ఆంధ్రశౌర్య సాహసములు దేశము–లన్నియు గనెనండి॥
మన శిల్పంబు లజంతగుహలలో – మాసిపోవలేదు
ఎల్లోరాగుహ శిల్పసంపదలు – యిప్పటి కున్నవిగా
బౌద్ధస్తూపములెన్నో మనభువి – బయలు పడెనుగాదా
విజయపురిని నాగార్జును ప్రతిభలు – విన్న వారుగాదా ॥ఆం॥
కొండవీటిలో రెడ్డినృపాలురు – దండి నేలునాడు
రాచకొండలో వెల్మ నరేంద్రులు – రాజ్యమేలునాడు .

రాజ్మహేంద్రమున గజపతిరాజుల- ప్రతిభ వెల్గునాడు
రాయలసీమను నరపతిరాజుల- ప్రభలు పర్వునాడు
ఆంధ్రపతాకములెట్లు వెలిగెనో - యరసిమేలుకొనుడు॥
దేశవస్తువుల, దేశసంపదల - తేరిచూడుడయ్యా
దేశముదాటిపోకుండగనూ - తెల్విగాంచుడయ్యా॥
దేశరక్షణము, దేశపాలనము - దేశవిజృంభణము
దేశభక్తియు దేశవృద్ధియు - తెలిసిచరించండి
దేశద్రోహుల దేశపు లేమిని - తిరిగికనుంగొనుడి ॥ఆం॥
కట్టుగుడ్డలకు పొట్టకూటికిని - కరువిక లేకుండన్
కట్టుకొనిన మన తెల్గురాజ్యమున - కష్టములీడేరున్
ఖనిజసంపదలు వణిజసంపదలు - గల్గియు రాష్ట్రమున
ఘనతరకార్య క్రమము లేమిని - గాంచమైతిమండి ॥ఆం॥
ఆంధ్రులేకమై యారంభించిన - నా పరిశ్రమలను
ఆంధ్రులకే కా దార్యావర్తం_ బంతకు సరిపోవున్
ఆనకట్టలను విరివిగ గట్టిన - నాంధ్రదేశమెల్లన్
వేనవేలుగా కోరిన పంటల - వెదజల్లుచు నుండున్ ॥ఆం॥
తంజాపురిలో నాంధ్రనాయకులు - ధాత్రి నేలునాఁడు
మధురరాజ్యమును బాలించుచు దమ-మహిమజూపునాఁడు
ఆంధ్రభాషలో పెక్కు గ్రంథముల-నల్లించెడునాఁడు
సంగీతాది కళాప్రవీణులై - పొంగుచున్న నాఁడు
ఆంధ్రపతాకంబెట్లు వెలింగెనో - యరసిచరించండి ॥ఆం॥
అభ్యుదయంబును దెల్పెరచయిత -లందరు మనవారే
అభ్యాగతులను పూజించెడిదే - యాంధ్రభూమియండి
కార్మికులైనను కర్షకులైనను - కడకెవ్వరుగానీ

ధర్మమార్గచింతనులై యాంధ్రప - తాకము గొల్వండి
భావయచౌదరి గీతము బాడుచు - బయలు దేరిరండి॥ ఆం
ఆంధ్రకుమారా ! ఆంధ్రకుమారీ ! ఆంధ్రవీరవర్యా !
ఆంధ్రపతాకం బిదిగో దీనికి - హారతు లివ్వండి

—కొత్త భావయ్య చౌదరి

## తమ్ముడా

శ్రీలుపొంగిన జీవగడ్డయి
పాలుబాఱిన భాగ్యసీమయి
వ్రాలినది యీ భరతవర్షము
భక్తిపాడర తమ్ముడా

వేదశాఖలు వెలసె నిచ్చట
ఆదికావ్యం బలరె నిచ్చట
బాదరాయణ పరమఋషులకు
పాదుసుమ్మిది తమ్ముడా

విపిన బంధురవృక్ష వాటిక
ఉపనిషన్మధు వొలికె నిచ్చట
విపులతత్వము విస్తరించిన
విశ్వమణి యిదె తమ్ముడా

సూత్రయుగముల శుద్ధవాసన
క్షాత్రయుగములచండశౌర్యము
చిత్రదాస్యముచే చరిత్రల
చెఱిగిపోయెర తమ్ముడా

మేలికిన్నెర మేళవించి
రాలుగరుగగ రాగమెత్తి
పాలతీయని బాలభారత
పదముబాడర తమ్ముడా

నవరసమ్ములు నాట్యమాడగ
చివురుపలుకుల జెవులవిందుగ
కవితలల్లిన కాంతహృదయుల
గారవింపర తమ్ముడా

దేశగర్వము దీప్తిజెందగ
దేశచరితము తేజరిల్లగ
దేశమరసిన ధీరపురుషుల
తెలిసిపాడర తమ్ముడా

పాండవేయుల పదునుకత్తులు
మండిమెఱసిన మహితరణకథ
కండగల చిక్కని తెనుంగుల
కలిపిపాడర తమ్ముడా

లోకమంతకు కాక బెట్టిన
కాకతీయుల కదనపాండితి
చీకిపోవని చేవమాటల
జేర్చిపాడర తమ్ముడా
తుంగభద్రా భంగములతో
పొంగినింగిని పొడిచి త్రుళ్లి
భంగపడని తెనుంగునాథుల
పాటబాడర తమ్ముడా
పసుపుకొంగుల ముసుగులెడలగ
కొసలుతీర్చిన కోరకత్తుల
కసరిపోరిన గండుయోధుల
పదముబాడర తమ్ముడా

— రాయప్రోలు

## ఆంధ్రులం

ఆంధ్రులం మన మాంధ్రులం
ఆదర్శ వీరులం
వెనుకనుండి మనచరిత్ర
వేనోళ్ల చాటుతుంది
గతంలో గొప్పవాళ్లం
గతిలేదుమనకు ప్రకృతం ||ఆం||
కాదుకాదుమతి చెడింది మనకు
అంగడిలో అన్నివున్నాయి
అల్లుడినోట్లో శనివున్నాది
అవిగవిగో గనులు
ఇవిగివిగో మణులు
గనులలో మణుల
గణగణ రణగుణధ్వనులు
వింటున్నాంవీనులవిందుగ ||ఆం||
గతాన్ని స్మరించుకుంటూ
వెతలన్నీ ఏకరువెట్టి
మతులన్నీ చెడగొట్టుకోక
మతిమంతులమయిననాడే
శ్రీమంతులమవుతామండి ||ఆం||
"గతం నశోచామి
కృతం స్మరామి" అంటూ
సతతం విద్యాసంపదకొఱకై
యతనం చేయాలి మనం
సమతను కోరాలి మనం ||ఆం||
విశాలాంధ్ర ఉన్నతికై
వెల్లువగా రావాలి ముందుకు
ప్రజావాహిని కడ్డులేదని
ప్రగల్భాలుగా గాకుండ
పనిలోచూపించాలిమనం ||ఆం||
ఆర్థికసమతే ఆదర్శమంటూ

సర్వోదయమే సాధించాలంటూ
కదంత్రొక్కి నిలబడినచో
కలలన్నీ కల్లలు కావండి ॥ఆం॥
నవ్యభారత నిర్మాణానికి
భవ్యభారత భాగ్యోన్నతికి
నడుంకట్టి నిలిచిననాడే
నదీజలాలను నాందిగా
సస్యశ్యామలంకొరకు
సద్వినియోగం చేసిననాడే
సమృద్ధిగ సాగించిననాడే ॥ఆం॥
గతాన్ని తలచి వ్రతాన్ని పూని
మతిమంతులమయిననాడే
ధరిత్రి పండి కళలు వెలిగి
దరిద్రం తీరుతుంది ॥ఆంధ్రు॥

— తేళ్ల రాజగోపాలరావు

## దేవాలయం - గ్రంథాలయం

దేవాలయం–నాటి – గ్రంథాలయం
గ్రంథాలయం–నేటి – దేవాలయం ॥

వేదాల ఓంకార
నాదాలు పాడారు
విజ్ఞాన బీజాలు
విశ్వాన చల్లారు
వేదాంత తత్వాలు
విష్ణుపూజలలోనె
విశ్వసేవలు చేసి
వెలుగు లందిచ్చారు ॥దేవా॥
వేదాల సారాలు
విడదీసి రాశారు
విజ్ఞానములు పోగు
చేసి చూపించారు
విశ్వసేవలలోనె
విష్ణుపూజలు చేసి
వేదాంతవేత్తలై
వెలుగందుకొన్నారు॥ దేవా
దేవాలయంలోని
దివ్య బింబాలలో
గ్రంథాలయంలోని
గ్రంథరాజాలలో
దేవుడే విశ్వమని
విశ్వమే దేవుడని
వేదాంత తత్వాలు
వినబడును మాకెపుడు॥దేవా

— శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం

# దేశభక్తి

దేశమును ప్రేమించుమన్నా,
మంచియన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్ 1

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువుపాటుపడవోయ్
తిండికలిగితె కండకలదోయ్
కండకలవాడేను మనిషోయ్! 2

యీనురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్?
జల్దుకొని కళలెల్ల నేర్చుక
దేశిసరుకులు నించవోయ్ 3

అన్ని దేశాల్ క్రమ్మవలెనోయ్
దేశిసరుకుల నమ్మవలెనోయ్!
డబ్బుతేలేనట్టి నరులకు
కీర్తిసంపద లబ్బవోయ్ 4

వెనకచూసిన కార్యమేమోయ్?
మంచిగతమునకొంచెమేనోయ్
మందగించక ముందుఅడుగేయ్
వెనకపడితే వెనకెనోయ్! 5

పూనుస్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థకలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయ్! 6

దేశాభిమానం నాకు కద్దని
వట్టిగొప్పలు చెప్పుకోకోయ్;
పూనియేదైనాను ఒకమేల్
కూర్చిజనులకుచూపవోయ్! 7

ఓర్వలేమిపిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయ్
ఒరులమేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయ్ 8

పరులకలిమికి పొర్లియేడ్చే
పాపికెక్కడ సుఖంకద్దోయ్?
ఒకరిమేల్ తనమేలనెంచే
నేర్పరికిమేల్ కొల్లలోయ్! 9

సొంతలాభం కొంతమానుక
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్,
దేశమంటేమనుషులోయ్! 10

చెట్టపట్టాల్ పట్టుకొని దే
శస్థులంతా నడవవలెనోయ్,
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్ 11

మతంవేరై తేను యేమోయ్ !
మనసులొకటై మనుషులుంటే
జాతియన్నది లేచిపెరిగీ
లోకమునరాణించునోయ్! 12
దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్,
నరులచెమటను తడిసిమూలం,
ధనంపంటలు పండవలెనోయ్! 13
ఆకులందున అణగిమణగీ
కవితకోకిల పలుకవలెనోయ్
పలుకులనువిని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయ్! 14

— గురజాడ

## సమతాధర్మము

సమతా ధర్మము సంస్థాపింపగ
సమయ మిదే మన కందరకున్
కులవైరాగ్నికి – కుములుచునుండెడి
కలుషమనంబును – కడిగివేయుచును ॥సమ॥
వర్ణభేదమును – ప్రక్కలుచేయుచు
వరబాంధవ్యము – వర్ధిలజేయుచు ॥సమ॥
హెచ్చుతగ్గులను – పిచ్చభావములు
విచ్చిపోవగా – వియ్యము బొందుచు ॥సమ॥

—సు. భా. సుబ్బారావు

## లెండోయి!

లెండోయి ఆంధ్రులార!
ఏకమ్మై కండోయి ఆంధ్రులారా!
ఆంధ్రజాతికి నేడు అవతరించెను కీడు
ఆంధ్రతేజము ప్రతిభ అలమి పోయెనుపాడు
లెండోయి ఆంధ్రులారా!

మనలోన మనకేమొ మనసులో కక్షలై
ధనము అధికారముల దాసులై చెడినాము
లెండోయి ఆంధ్రులారా !
పాత గాథల గర్వపడితె లాభం ఏమి
చేతలో పందలై చెడిపోవు జాతికి
లెండోయి ఆంధ్రులారా!
ఏకమ్ము కండోయి ఆంధ్రులారా !

— అడివి బాపిరాజు

## వందే మాతరం

సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం ॥వందే॥
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధురభాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥వందే॥

— శ్రీ బంకించంద్ర ఛటర్జీ

## సైనిక శిక్షణ

ఆంధ్ర యువకవీరులార సాగి ముందునడువుడోయ్
ఆలసింప నేటికోయ్ స్వతంత్రతనునిలుపుడోయ్
ఆలసింప నేటికోయ్ శౌర్య పటిమ చూపుడోయ్
అందఱును జేరుడోయ్ సాహసంబు నిలుపుడోయ్
సైనిక శిక్షణమునంది సాహసంబు నిలుపుడోయ్
సాగి ముందు నడువుడోయ్ స్థైర్యముతో నిలుపుడోయ్

భరతదేశ రక్షణ నీ
పైన బడెనె యువకుడా!
పైనబడెనె యువకుడా!
బాధ్యతగనువీరుడా! ॥ఆం॥
సైనికులుగ శిక్షణంబు
సత్వరముగ నొందుడోయ్

సత్వరముగ నొందుడోయ్
స్వతంత్రతనునిలుపుడోయ్
జగతికెల్ల భారతీయ
శౌర్యమహిమ తెలుపుడోయ్
శౌర్యమహిమతెలుపుడోయ్
జగద్ధితము జేయుడోయ్

— జాస్తి

## కవినోయ్

వేయిసంవత్సరాల్ వెనకాల కవినోయ్
వేయిసంవత్సరాల్ వెడుతూనె కవినోయ్
వేదాల బుక్కులో పాడాను నేనోయ్
వాల్మీకిగొంతులో ప్రవహించినానోయ్
నన్నయ తిక్కన్న వెన్నెల కవిత్వాన్ని
ఈనాటి పాటలో ఇమిడిపోయానోయ్
దేశాల కవితలో దీపించినానోయ్
ఆశాంతములవఱకు ఆవరించానోయ్

— అడివి బాపిరాజు

## మంగళం

ఆంధ్రమాత శ్రీసమేత
అనుపమ ప్రపూతచరిత
అఖిలభక్త పారిజాత
అమల మంగళం ॥ఆంధ్ర॥
మొల్లముఖ్య కవయిత్రుల
మల్లమాది సాధ్వీమణుల

అల్ల రుద్రమదేవిగన్న
తల్లిమంగళం ॥ఆంధ్ర॥
రామదాసాదిభక్త
రత్నములను గన్నతల్లి
తిక్కనాది కవులగన్న
దేవిమంగళం ॥ఆంధ్ర॥

తిమ్మరుసు యుంగధరాది
దివ్యరాజ నీతిపరుల
వల్లభాది మతకర్తల
తల్లి మంగళం ॥ఆంధ్ర॥

నాగ్నజిత్తుముఖ్య శిల్పి
నాయకులను గన్నతల్లి
ఆపస్తంబాదిమునుల
అంబ మంగళం ॥ఆంధ్ర॥

— 'జాతీయగీతముల' నుండి

## భారతభాగ్య విధాతా!

జనగణమన అధినాయక జయహే భారతభాగ్య విధాతా
జయహే—జయహే—జయహే—జయజయజయ జయహే ॥
పంజాబ సింధు గుజరాత మరాఠా ద్రావిడ ఉత్కల వంగా
వింధ్య హిమాచల యమునా గంగా ఉచ్ఛలజలధి తరంగా
తవశుభనామే జాగే తవశుభ ఆశిష మాగే
గాహే తవజయగాథా
జనగణ మంగళదాయక జయహే భారత భాగ్య విధాతా
జయహే—జయహే—జయహే—జయజయజయ జయహే॥
అహరహ తవ ఆహ్వాన ప్రచారిత సునితవ ఉదారవాణీ
హిందు బౌద్ధ శిఖ జైన పారసిక ముసల్మాన క్రిస్తానీ
పూరబ పశ్చిమ ఆసే తవ సింహాసన పాసే
ప్రేమహార హాయ గాథా
జనగణ ఐక్యవిధాయక జయహే భారత భాగ్యవిధాతా
జయహే—జయహే—జయహే—జయజయజయ జయహే॥

— రవీంద్రనాథ ఠాకూర్

భారతీప్రెస్, తెనాలి - 1955.

ప్రతులకు :—

జాస్తి వేంకట నరసయ్య
చిలకలూరిపేట (గుంటూరు జిల్లా)

లేక

**వెంకట్రామ అండు కో, విజయవాడ-1**